శ్రీమతే రామానుజాయనమః





శ్రీ రామానుజ సుప్రభాతము.

# శ్రీ హనుమద్గిరి యతిరాజ శతకము.

గోదాస్తవ నక్షత్రమాల.

గోదా పంచరత్నములు.

గ్రంథకర్త:
శ్రీ ఉ॥ వే॥ తిరునహరి వేంకటాచార్యులవారు.

ప్రకాశకులు:
[నైజాం, వరంగల్ తా॥ బాయపర్తి నివాసులు]
శ్రీ ఉ॥ వే॥ తిరునహరి రంగాచార్యః

ప్రోత్సాహకులు:
మ॥ గార్లపాటి శివకానందరావుగారు, బెజవాడ.
(రామానుజకూటంపంతులు)

సహాయకులు:
శ్రీయుత నిడుముక్కల సుబ్బారాయుడుగారు, బెజవాడ.

శ్రీ సర్వధారినామ సం॥ ఆశ్వీజ శు॥ ౫

1948.

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 8 | జీవాతుడై | జీవాతువై |
| 3 | 2 | జూరె బూరె | జూరె |
| | 11 | మాడ్చి | మాడి |
| | 14 | మసిచ్యాను | మసింత్యాను |
| | 18 | లడము | లందము |
| | 19 | రాధము | రాధరము |
| 4 | 1 | నర్ధంచు | నర్ధంబు |
| | 2 | రుచిను | రుచిన్ |
| 5 | 20 | యతేని | తేయని |
| 7 | 6 | దల్బ | దల్వ |
| 8 | 5 | కృతి | కృత్తి |
| 9 | 14 | కెరు | కెడుం |
| 10 | 3 | యడు | యాడు |
| | 14 | దుర్లంభం | దుర్లభం |
| 11 | 2 | ముఖాది | ముఖోది |
| 12 | 2 | భుధ | బుధ |
| | 10 | హృకు్క | హృత్కు |
| | 12 | ధూతము | భూతము |
| | 18 | మీదరిగి | మీరంగి |
| | 25 | మార్గలన్ని | మార్గములన్ని |
| 13 | 7 | యుంటుపో | యుండను |
| | 8 | నీకుదే | నీకుపోదే |
| | 14 | యంచా | యంబా |
| | 26 | డిక్షితి | డీక్షితి |

(మిగతా చివరి పేజిలో)



రామానుజదాసుడు

ఏడుముక్కల సుబ్బారాయుడు,

విజయవాడ.

శ్రీమతే రామానుజాయనమః.

శ్లో॥ పుణ్యాంభోజవికాసాయ ॥ పాపధ్వాంతక్షయాయచ ।
శ్రీమానావిరభూద్భూమౌ, రామానుజ దివాకరః॥—

# విజ్ఞాపన.

ఈ యతిరాజ శతకము. శ్రీ ఉ. వే. తిరునగరి, వేంకటాచార్యులవారిచే సాయింపబడినది. శ్రీభాష్యకారులు తిరునారాయణపురమునుండి తిరిగి వేంచేయునపుడు నైజాం మండలములోని హనుమద్గిరి (హనుమకొండ)కి వేంచేసిరి. అపుడు అచటనుండెడి ప్రపన్నులందరు ఆరామానుజులను సేవించిరి వారి వైభవాతిశయములను కనులార గాంచి ఆనంద పరవశులై మీవిశ్లేషమును సహింపజాలము అని వారిని ప్రార్థించిరి. అందుపై పరమకృపచే శ్రీ రామానుజులవారు స్వయం వ్యక్తమగు తమ దివ్యమంగళ విగ్రహమును కృపచేయగా వారెల్లరు సేవించి ఆనంద భరితులైరి. అది మొదలు హనుమద్గిరి, 'ఉత్తర శ్రీ పెరుంబూధూరు, అని ప్రసిద్ధి కెక్కియున్నది.

తరువాత (500) సంవత్సరములకు ఆళ్వారు తిరునగరిలో వేంచేసియుండు, శ్రీ. ఉ. వే. ప్ర. అయాచిత బిరుదాంకితులగు కృష్ణమాచార్యులవారు అను యీ గ్రంథకర్తగారి పితృపాదులు మా మూల పురుషులు యీ హనుమద్గిరి యతిరాజుల వైభవాతిశయములను విని, సేవించుటకై అచటకు వేంచేసి, ఉడయవరుల సన్నిధిలోనే ఉభయవేదాన్త గ్రంథ కాలక్షేపములను జరుపుచుండిరి, దీపా దుత్పన్న ప్రదీపమువలె నుండు వీరి కుమారులు, శ్రీ ఉ. వే. ప్ర. వెంకటాచార్యులవారును తండ్రిగారివలె సన్నధిలోనే ఉభయవేదాన్త గ్రంథ కాలక్షేపములను జరుపుచుండెడివారు. ఇట్లుండ నొకనాడు ఉడయవరుల దివ్యమంగళ విగ్రహమును సేవించునపుడు ఆనంద

పరవశులైన వీరి తిరువాక్కునుండి అప్రయత్నముగ ఉడయవరుల పరమ కృపచే గాబోలు పద్యరూపముగ నుండు యీ శతకము వెలువడినది. ప్రతి పద్యమునందును నాల్గవ పాదమందలి'' యతిపతీ హనుమద్గిరి రాజమందిరా" అనెడి వీరి పిలుపునకు శ్రీ రామానుజులు అర్చాసమాధినుండియే 'ఓ' యని బదులొసంగిరని వీరి వైభవము నందు తెలియనగును యిట్లు పరమభోగ్యముగ సంప్రదాయార్థములతో నిండియున్న యీ శతకము. ‹రామానుశనూఱ్ఱన్దాది, ఆర్తి ప్రబంధములలోని అర్థములనెల్ల విశదీకరించుచు ప్రపన్న జనజీవాతువై విరాజిల్లుచున్నది. యిట్టి పరమభోగ్యమగు యీ గ్రంథరాజమును యీ దేశమున నుండు ప్రపన్నులందరు అనుభవించి యుజ్జీవింపవలెననెడి సద్బుద్ధితో, ముక్తిపల్లి అగ్రహార వాస్తవ్యులగు శ్రీమాన్ సముద్రాల తిరువేంగళాచార్యులవారి శిష్యులు, నిడుముక్కల పిచ్చయ్య, మహాలక్ష్మమ్మగారల కుమారులు, సుబ్బారాయుడుగారు ముద్రింపించి లోకమునకు మహోపకార మొనరించిరి. యిట్టి శ్రీయుత నిడుముక్కల సుబ్బారాయుడుగారి వంశము శ్రీరామానుజుల వారి నిర్హేతుక కృపచే నిహపరములందు సకల శ్రేయస్సులు కలిగి ఆచంద్రార్కముగ వర్ధిల్లుగాత, అనిప్రార్థించుచు యింతతో పీఠికను ముగించుచున్నాడను.

యీ గ్రంథము కావలసిన వారికి యుచితముగ సమర్పింపబడును.

ఇట్లు.

—తిరునగరి రంగాచార్యులు

ఇందు పద్యముల చివర 'గురు'.'ఉడ' ‹ప్ర' యనుస్థలముల గురు పరంపరా ప్రభావము ఉడయవర్ వైభవము, అనియును, ‹ఇరా' అనుచోట ఇరామానుశనూఱ్ఱన్ధాది అనియును, 'ఆర్తి, యన ఆర్తిప్రబంధమనియు నెఱుంగునది.

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమద్రామానుజ మేలుకొలుపు దశకం.

  

ఈకవి గోత్రనామములు తెల్యలేదు.

ఉ. కమలంబుల్ వికసించే జక్కవల కా । కల్ దీరె నక్షత్ర సం
ఘములున్ వెన్నెలతో నుజారెబూరెకృక వా। కధ్వానమ్ముల్ మీ రెసం
తమ సంబంతయువిచ్చె ప్రాగ్దిశను మా । ర్తాండోదయంబయ్యె నా
కు ముదవ్రాతము నిద్ర చేకొనియె । మేల్కొనయ్యరామానుజా।

మ కరమొప్పన్ భవదీయదాసులతివే । డ్కన్ వచ్చి మీపాద పం
కరుహద్వందముగాంచి మ్రొక్కుటకు నై। కాంక్షించియున్నారు
సాదరలీలను కృపజేసి తత్వహిత సం । థాన ప్రదానంబు చే
కొరతల్ దీరుచునట్లు బ్రోవవలె । మేల్కొనయ్య రామానుజా॥

మ. ధరలోననుగల బద్ధులను విరజలో । స్నానంబు జేయించి మీ
చరణాబ్జంబులచెంత జేర్తురనియు । త్సాహంబు దీపింప శ్రీ
వరుతో పన్నిదమాడ్చి వచ్చి కలి గ । ర్వంబంతయునుదీర్చు స
ద్గురు రాట్పుంద్రుడవీవే మ్రొక్కెదను । మేల్కొనయ్యరామా।

మ. ప్రమదంబొప్పగ బ్రహ్మముక్తులకు జె । వ్వను భేదమెట్లయ్యె త
త్వమసి చత్యను వాక్యసంగతిః న । ర్థం బేమి యూహించు మం
చరమరుల్ మాయలవచ్చి నిల్చిరట వ్యా। ఖ్యానాలయంబందు త
త్కుమతవ్రాతముత్రుళ్ళడంచవలే మే । ల్కొనయ్యరామా॥

మ. కమలద్వంద్వము మీదుకన్నుగవరా । కాచంద్రబింబంబు చె ।
ల్వము పెంపొందు ముఖంబు సింగిణిల లీ।లనుమించు కన్బొమ్మల
డము మందస్మిత సుందరాధరము ప్రో । ద్యద్గండ భాగంబులున్
కొమరొప్పందగ సేవనాకొసగ । మేల్కొనయ్యరా॥

మ॥ గరిమన్ మంత్రపదత్రయంబునడుమను గన్పించు నర్థంచునం
దురుచినుజెందగజేసి నెమ్మదికి సం। తోషంబువాటిల్ల సా
దరమింపొందవిభక్తియందు। ప్రతిపాద్యంబైన మేల్గూర్చి నా
కొరతల్ దీర్చినదేశి కాహ్వాయుడ మే। ల్కొవయ్యరా॥

మ॥ తిరుమంత్రంబుననుండు నారపదమును దీ। పించు వాక్యద్వయా
దరణీయంబుగనొప్పు తచ్చరణశ। బ్దంబర్థ యుగ్మంబు నం
దిరవైయుంను ననేకముల్ గనుపడను। యింపొంద మీమేనునన్
గురిగానైకృతజూపి బ్రోవవలే మే। ల్కొవయ్యరా॥

మ. ఆరలేకను గరుణించి తొల్దొలుత దే। హాత్మాభిమానంబుదు
స్తరమంచును దొలగంగజేసి ని। ఖిలాత్మ శ్రేణికిన్ గల్గు త
దర్భరముల్ గైకొని వారు నిర్భరులుగా। పాటించి రక్షించు స
ద్గురురాట్చంద్రుడవీవ దిక్కుకద మే। ల్కొవయ్యరా॥

మ॥ తెరపుంగానకనుండు జీవతతికి। ద్వేషాభిముఖ్యంబు లా
దరణీయంబుగ గల్గజేసి యట స। త్సాంగత్యమును గూర్చి నీ
చరణాబ్జంబుల చెంతజేర్తునని యు। త్సాహంబు దీపించు స
ద్గురురాట్చంద్రుడవీవె మ్రొక్కెదను మే॥ ల్కొవయ్యరా॥

మ॥ కరిశైలేశుడు వేంకటాద్రిపతి। రంగస్వామి శ్రీయాదవా
ద్రి రమాధీశులు యంతరంగులట మీ। దివ్యావతార ప్రభా
గరిమంబంతయు మున్నుశారదయు మూ। క బహ్మరక్షస్సులున్
గురిగాజెప్పిన తండ్రి వీవకద మే। ల్కొవయ్యరా॥

మ. పరమోపాయమటంచు నీదశకమును। ప్రాతర్ముఖంబందు సు
స్థిరబుద్ధిన్ పఠియించువారలకు సం। దేహంబులేకుండ మీ
చరణాబ్జంబుల భక్తిదీరక మహా॥ సాంబ్రాజ్య కైంకర్య త
త్పరులైపిమ్మట నిత్యసూరులన॥ జెప్పన్ విందు రామానుజా॥

శ్రీమతేరామానుజాయనమః

శ్రీనివాస గురవేనమః

# శ్రీ హనుమద్గిరి యతిరాజ శతకము

---

శ్రీమహితాకృతీనిగమ శేఖరసార విచారవాగ్గతీ ।
క్షేమమహామతీస్వజన చిత్రవిచిత్ర భవాబ్ధమారుతీ ।
కామనిరాకృతీ పరసుఖాకర సంతతదాన్య సత్కృతీ ।
క్షేమదయారతీ యతిప । తీ హనుమద్గిరి రాజమందిరా॥ ౧.

కాంతిమతీ సతీవిమల । గర్భసముద్భవభూతనామ వి
శ్రాంతపురాధి నాయక ని । రంకుశ వైష్ణవ సిద్ధధర్మరా
ద్ధాంతకరప్రభావకలి । తా భవదీయ విశాలకీర్తి కీ
ర్తింతురు నిచ్చలుం యతిప । తీ హనుమ॥ ౨.

పాయనిరక్తి మీచరణ । పంకజయుగ్మము కాంతులీను కా
షాయమునాభి బొజ్జయును । చారుపవిత్రము సారసాక్షమా
లాయుతకంఠ దేశమును । లాలితహాస విలోకనల్ సదా
ధ్యేయముసుమ్మమా యతివ । తీ హనుమ॥ 3.

తెల్లని యూర్ధ్వపుండ్రములు । తేజముగల్గు ముఖంబుకాంతి సం
ధిల్లుత్రి దండమంజలియు । దీర్ణపువక్షము బ్రహ్మసూత్రమున్
ఎల్లరుగొల్చు పాదములు । యెప్పుడునామదిలోననిల్పి వ
ర్ధిల్లగదయ్య!వో యతిప । తీ హనుమ॥ ౪.

శ్రీయుత విగ్రహాయ శఠ । జిన్మని పాదసరోజభక్తి యు
క్తాయగుణాత్మకాయవర । తంత్రసుఖాన్విత కూరనాథ నా
థాయ సులక్షణాయవర । దాయవరాయ సదాస్తుమంగళం
యతేని బల్కుదున్ యతిప తీ । హనుమ॥ ౫.

శ్రీవరుడుస్ రమామణి ప్ర । సిద్ధిచమూపశఠారి నాథ రా
జీవదళాక్ష రామగురు । శేఖరయామున పూర్ణులాదిగా
మీావరపూర్తిచేపరిణ । మించిరిగావున నెల్లవారికిన్
దేవుడవౌదు వో యతిప । శ్రీ హనుమ ౬.

కాంతిమతీతనూజ సమ । కాలపు దేశికు లెందరెందరే
కాంతమునందు మీాచరణ కంజములే సదుపాయమంచు సి
ద్ధాంతముజేసి తమ్ములను । దగ్గరగొల్చిన వారికెల్ల బో
ధింతురు ముక్తికై యతిప శ్రీ హనుమద్గిరి॥ ౭.

ఉతలి దేశికోత్తములు । నెప్పుడు పాయని భక్తిచేత మి ।
మ్మేతల పోయుచుండెదు య । మేయ గుణాఢ్యుల గొల్చువారలే
త్రాతలటంచు బల్కుటలు । తథ్యములౌనటు గానప్రాపులే
దేతలపోయగా యతిప । శ్రీ హను॥ ౮.

శ్రీద్వయనిష్ఠనిన్ బిలచి । చెన్నగురంగ పురీశ్వరుండు క
ర్మద్వయ మోచనాయికను । రాజవునేపర తంత్రుడన్ యిదే
మద్వచనంబటంచు బహు । మానములన్నియు జేసితా విభూ
తిద్వయ మిచ్చెనా యతివ । శ్రీ హను॥ గురు-ఉడైయవర్ ప్ర-వ 3౮౦

కోరిక శంఖ చక్రములు । కూరిమితో నలివేలుమంగ నా
చ్చారునొసంగ నల్లుడను । సమ్మతి శిష్యుడ నైతినంచు నీ
కారయ వేంకటేశ్వరుడు నా । చరణల్ బహుగానొనర్చెనా
తీరుదలంతునో యతివ । శ్రీ హను॥ గురు ఉడ-ప్ర-వ-3-౮౯ ౧౦

ఇభగిరి నాయకుండగుర । మేమకుపేర రుళాళరాప్పడై
యభయదమైన వార్తలొక । యారునెరుంగగ దెల్పెనంత త
త్ప్రభునిని యోగవద్ధతిని । దర్శనకారణ కర్తలైతిరా
త్రిభువనపాలనా యతివ । శ్రీ హను॥ గురు-ఉడ-ప్ర-వ-3౮౧ ౧౧

పూనిక చేకురంగ పరి । పూర్ణుకు శిష్యత తాళజించి రా
మానుజనాంబి నావెలసె । మాద్రుశజంతు సమష్టికెల్ల రా
మానుజమంత్ర రాజమన । మానము తద్రుచిగల్గజేయుమో
దీనదయాపరా యతివ । శ్రీ హను॥ గురు ఉడ-ప్ర-వ-వ 3౮౨ ౧౨

వదలక యాదవాచల ని । వాసుడు ద్వాదశవర్షముల్ మహా
భ్యుదయముమీరనుండి వర । భోగపరంపర లొప్పుజాయ నె
మ్మది ననురాగమొందుచు కు । మారుడనీకని యానతిచ్చె నా
త్రిదశ జనస్తుతా యతిప । తీ హను॥ గురు-ఉడ-ప్రప-౩౮౧ ౧౩

పూర్తిని నీలశైలముకు । బోయినిరంకుశమైన యట్టి త
ద్వర్తన దిద్దదల్పహరి । తానదియొప్పగ మోచితెచ్చి మి
మ్మార్తినికూర్మ మందునిచె । నందునవిష్ణురథాఖ్యచేత స
త్కీర్తినిచెందితౌ యతిప । తీ హను ॥౧౪॥ ఆ-సూము-ఉ-వై ౧౮౬

భూతసరోమహామునులు । పుష్పములందవతారమొంది ప్ర
ఖ్యాతివహింపగాద్ర విడ । కావ్యము లానతియిచ్చిలోకులన్
పూతులజేసిరంచు తల । పోసెడి మిమ్ములనేభజింతు పృ
థ్వీతలమందు వ్రో యతిప । తీ హను॥ఉ-ర-మా-పా-౭పొయికయార్

హారికినినాచ్చిమారులకు । నాయుధపంక్తికి సర్వమంగళా
చరణముగాగ నొక్కకృతి । సత్కృతిజేసి తదేకనిష్ఠచే
బరగుటనాళ్ళువారులలో । బాగుగనాపెరియాళ్లువారి భ
క్తిరతిని మీరతౌ యతిప । తీ హను ॥౧౬॥ పా-శౌరాద.

మారికలేని యామకర । మాసమునన్ మఖతారకన్ మహీ
సారమునన్ జనించి బుధ । సత్తములెన్నగ భక్తిసారులన్
పేరప్రసిద్ధి కెక్కిరని పెంపుగవారినె దల్చుచుందువౌ
ధీరజనస్తవా యతిప । తీ హను॥౧౭॥ ఇరా-౧౨ పా-ఇడంగొండ.

కొలదకిమీరి వైష్ణవుల కోసము । పామునుబట్టి వెంకటా
చలమున తిర్యగాదులగు । జన్మములే తలపోసికోరి రా
ముల చరితామృతంబునకు । మోహపడెన్ కులశేఖరున్డదే
తెలియగదెల్పుమా యతిప । తీ హను ౧౮ ఇరా ౧౪-పా-కదకుప్ప.

రంగపురీశ్వరుండను వ । రంజిలుభక్తి దలర్పలోక సా
రంగ మహామునీశుదన । రారభుజాగ్రము నెక్కజేసి మో
వంగను బెట్టెనట్టి తిరు పాణుని వైభవ మాత్మదల్తునా
త్రింగురుశేఖరా యతిప । తీ హను ౧౯ ఇరా-౧౧-పా-శీరియ.

తులసిని పుష్పజాతముల । తోరపుదండలగుచ్చి రంగ భూ
నిలయున కర్పణంబులుగ । నిత్యము జేసిన భక్తపాద రే
ణుల చరితల్ దలర్పనతి । నూత్నములౌనని యీడుపడ్డనిన్
తెలియగశక్యమా యతిప శ్రీ హాను ౨౦ ఇరా-౧౩-పా-శేయుంపశుం

ఉరుతరమైన యాతురయ । లూరనుకార్త్తిక కృతికోడునన్
పరమదయాళుడైకలిగి । భాగవతాళికి నారగించగా
కరమనురక్తి జేయుపర । కాలుని వైభవమాత్మయందు సు
స్థిరముగ నిల్పితౌ యతిప శ్రీ హాను ౨౧ ౨-కళ్యాళ్.

అధికతపిష్ఠుడై బదరి । కాశ్రమ మందుననుండి వచ్చి యా
మధురకవీశ్వరుల్ కురుకు । నూరులగొల్చి తదంఘ్రినీమ్మ చే
సుధకు సమానమైన తమ । నూస్త్రులవారిని బాడుచుంకు త
ద్విధమెవచించితౌ యతిప శ్రీ హాను ౨౨ ఇరా ౧౭ పా-ఏయిదర్కు

గారవమొప్పనీ జగము । గావగ కారికుమారులైన యా
శ్వారి పదాంబుజంబులు భ్రు । వంబుగభక్తి విశాలమా హృదా
గారమునందు నిల్పికలి । కాలవిశేష సమస్త దోషముల్
తీరగజేసితౌ యతిప శ్రీ హాను ౨౩ ఇరా ౧-పా-పూమన్న.

సులభతమీరగా జగతి । సుందర బాహున కైదునూర్ల బా
నల నవనీతమర్పణ మొ । నర్చినగోదయు సంతసిల్లి చె
ల్లెలమరి మీరలన్నలని। లెక్కడెగాదె తదీప్సితంబు మో
దిలనెరవేర్చితౌ యతిప శ్రీంహాను ౨౪ గురు-ప్ర-ఉ వై ౩౬౩

దేశికులెన్నవత్సకుల । దీపకులౌనిగమాంత నామ
సద్దేశికు లప్పలార్యులను । దేశికులిద్దరుగా రచించి మీ
దేశిక దేశికత్వమును । దేశముశాయగ నమ్మినాడ నో
దేశిక దేశికా యతిప । శ్రీ హాను ౨౫

ఎక్కువ తక్కువల్ గలుచు యెక్కువవారల కెక్కువైన పె
న్నిక్కపు వైష్ణవోత్తముల నిక్కముగాను పరాభవించియే
దిక్కును లేక యీయమున । దిక్కన కేగెదు నన్నుగావగా
దిక్కకమీరెగా యతిప । శ్రీ హాను ఇరా ౬౧ పా-కొళుంది

ప్రల్లదుఁడైన వాఁడనని । బాహ్యునిచేయక సర్వకాలమున్
తల్లియుతండ్రియున్ గురువు । దైవముదాతయు పుత్రవర్గమున్
ఇల్లుధనంబు భోగమును । ఇన్నియు మీచతురక్షరంబె త
వర్ధిల్లగ జేయుమీ యతిప । తీ హాను ౨౭ ఇరా-౪౪-పా శొల్లార్.

ఎంచదునామనంబు మతి । యించదునాలుక యెట్ట కేలకున్
వంచదునాడు మాళియతి । వాంఛలకన్నుల జూడనోపదే
వంచనజేయు నీకలిని । వారణజేసెటి మిమ్ముఁగొల్చి
వర్తించని వాఁడనో యతిప । తీ హాను ౨౮ ఆర్తి ౪౯

తాపము నూర్ధ్వపుండ్రమును । దాస్యపునామము మంత్రరత్నమున్
ప్రాపుగయాగమున్ గలిగి । పాత్రునిగాని యర్థపంచక
జ్ఞాపనమున్ననర్పితివి । సాధుజనస్తవ హేతుభూత ను
ద్దీపితవైభవా యతిప । తీ హాను ౨౯ ఇరా ౫౭ పా పార్త్తానోరు.

తిరునగరాళువారుల । మరింగల యర్థము స్వప్రబంధ వి
స్ఫురణదలిర్పగాపొలిగ పోలిగయుంకెరు । ''కండుకొణ్మి నం
చిరవుగ నాథమానులకు । యేర్పడదెల్పిన యర్థతత్వమీ
తిరువవతారమో యతిప । తీ హాను॥30॥ ఇరా-౨౦-పా ఆవప్పోల్.

చిరుతరదుస్స్వతంత్రమున । శ్రీశుకటాక్ష విశేషపాత్రతా
విరహితులైస్వకర్మముల । వెంబడి జచ్చుచు బుట్టుచుండు నీ
నరులు భవాబ్ధిదాటుట ఘనంబగు హేతువయెంచిచూడ మీ
తిరువడిగళ్ గదా యతిప తీ హాను 3౧॥ ఇరా-౭౯-పా పొమ్మెరక్క

వేదములన్నియున్ ద్రవిడ । వేదముసార్థము జేయబూని న
త్యాదరమొప్పభూమి నవ । తారమునొందిన మిమ్ముఁగొల్చు భా
గ్యోదయు నాశ్రయించిన మ । హూన్నతులెవ్వరొ వారు వేదహృద్వే
దులునాదురో యతిప తీ హాను॥3౨॥ఇరా-౮౬-పా పత్తా

దృశ్యమదృశ్యమున్ భవదు । దీర్ణపదాంబుజ దాసదాస త
ద్దాస్యఫలంబె యానను బు । ధప్రకరంబుల గొల్చువారలా
పశ్యకులంచు నమ్మగల । వారలవారల వారివార లు
ద్దేశ్యులుయందురో యతిప । తి హాను 33॥ ఇరా-౮౫-పా శీరియ॥

మానము మనంబుమిమ్ము వలు । మారుదలంచిన యుష్మదర్థమా
ధనము ధనంబు తావక ప । దద్వయ కింకర వృత్తియైన దే
ఘనము ఘనంబువైష్ణవుల । గన్గొని వారలగూడి యడుటే
దినము దినంబుగా యతిప తీ హను ॥౩౩॥ ఇరా-౮౦-పా నల్లా.

దురితము జేయువాడ నతి । దుర్మతి సద్గురు మంత్రదేవతా
పరిభవశీలుడన్ కృపణ । భావుడనీచుడ మూఢుడన్ దయా
విరహితుడన్ జడుండగుణ । వృద్ధులలోన ననర్హు నన్ను నే
తెరవునగాచెదో యతిప తీ హను ౩౪ ఇరా-౨౮-పా కరుత్తిల్.

నారువడంగ నప్పెరియ । నంబి పదాబ్జములాశ్రయించి సం
స్కారములైదిటిన్ వడసి । కంచిన వేగ మెసన్యసించి యా
కూరకులేశ్వరాది యను । కూలులుగొల్వగ నొప్పుచుండు మీ
తీరము జేరితిన్ యతిప । తీ హను ౩౬

అనుపమమైనయట్టి చర । మార్థముకోసము కోట్టియూరు నం
బిని తగమీరు బోయడుగమారొక్కని యిందధికారి దుర్లభం
బనుమరి యర్థగౌరవము । బ్రాహ్మనగాకడు నేగినారు ప
ద్దెనమిది మారులో యతిప । తీ హను ॥౩౭

భావముజూడ నంబి తమ । పాదములందున యానబెట్టి మీ
రీవర సంప్రదాయము మ । రోరికిజెప్పగ రాదటంచు వా
రావిధమేర్పరింప గురు । వాజ్ఞనుమీరి యథేచ్ఛసాటరా
దేవరవారలో యతిప । తీ హను ॥౩౮

స్థాయిగరంగనాయకుని । సన్నిధిదాస్యము జేసి మీరునా
లాయిరమన్వయించి సక । లాత్మలకున్ కృపజేసి వైష్ణవ
శ్రీయొనగూర్చి మించితిరి । శ్రేయము పాయము పేయమున్న పా
దేయము మీరెకా యతిప । తీ హను ౩౯

పరమసుఖంబు ముక్తికి ను । పాయముపుణ్య మనన్యభక్తి సా
గరముపవిత్ర పాత్మజ ము । ఖ్యపసృతంబునునైనరామ భా
స్కర చరితామృతార్థమప । గాహనజేసితిరాప్తులైన యా
తిరుమల నంబిచే యతిప । తీ హను ౪౦ ఇరా-౩౭-పా పణికొండ.

ఉరువగు గొప్పసంపదయు । నోపికగల్గిన తల్లితండ్రి స
ద్గురుడు రమావిభుండు శఠ । గోపముఖాదిత వేదమంచు త
త్పరతతదర్థమున్ తెలియ । దాసుసమాఖ్యులజేరి వారిమం
దిరములనుండ రా యతిప । తీ హాను ॥౪౧॥ ఇరా-౧౯-ఉరుపెరుం.

ప్రణవముధ న్వమాత్మ పటు । బాణము లక్ష్యము బ్రహ్మగాను స
ద్గుణ గురుడే ప్రయోగమున । కుందగు చోధకుడట్లుగాన యీ
గణన పరావరాత్మలకు । గల్గున భేదమభేదవాదమే
తృణగతిమూలెగా యతిప । తీ వాను॥౪౨ ఇరా-౬౫-పా వాళ్య.

అడియడు బోలుదోసముల । నన్నిటజేసిన వారులేరు యీ
పుడమిని మిమ్ముబోలు పరి । పూర్ణదయాళులులేరు మీరుచే
విడువదలంచితేని బరు । వేమరి తీగకుకాయ మిమ్ము బొం
దెడిదెటువంటిదో యతిప । తీ వాను ॥౪౩ అర్తి ౪౧

శిశువుకుగల్గు రుగ్మతన । శింపగ తానె కషాయమాని త
ద్దశతొలగించు తల్లివలె । దాసులరక్షణ దీక్షచేతనా
వశమగు సాధనాచరణ । వైఖరినుండుట మీకుతక్క వే
దిశలప్రసిద్ధిగా యతివ తీ వాను॥౪౪ ఆర్తి ౭-రా-పా

రందుమదీయ చిత్తకుహ । రంబున బాయక సర్వకాలము
న్నుండుత దేశదాస్యరుచి । నొందిన వారలవారిదాస్యమే
యిందుశిరంబునందు ధరి । యించెద దేవరవారిపాదుకల్
తెందుమహామతీ యతిప । తీ హాను॥౪౫ ఇరా-౮౩-శీరుకొండు.

కూపముచెంత నాడుకొను । కూతురుజూచియు జూడనట్లు నుం
టే పెనునిందతల్లి కగు । చేయది దప్పని యట్లునేను నా
పాపముచేతజెడ్డ నిక । పాయక మీకపకీర్తిరాకపో
దేపరికింపనో యతిప । తీ హాను ॥౪౬ అర్తి౮-పా.

కలుషములేకయున్నసధి । కారినిగావగరంగనాథుడే
కలడిలమీద నైనసధి । కారినిగాచెదనంచువచ్చి మీ
రలు నధికారమే వెతకి । రక్షణచేసెద మన్నమేముభ్రాం
తిలపనిలేదుగా యతిప । తీ హాను॥౪౭ఆర్తి-౧౪

భవ్యముమీచరిత్రలను । భావ్యము మీసుగుణాళి నిత్యజ
ప్తవ్యముమీదు నామము భు ।భ ప్రకరంబుల కెల్లవేళ న
స్తవ్యము యుష్మదంఘ్రియుగ । సన్నిధిదేవర విగ్రహంబె వ్రా
దివ్యము సేవ్యమున్ యతిప।తీ హాను ౮౮॥ఇరా ౮౮-పా-కంచుకొండు

స్మరపరతంత్రుడన్ విషయ । మగ్నుడనై చరియింపుచుండ మీ
స్మరణయొకింత లేక దిన । సంబుల వ్యర్థముబుచ్చ నాకెహో
నరనుతుడైన యావడుగ । నంబికిగల్గు తదీయనిష్ఠయే
తెరగునగల్గునో యతిప । తీ హాను॥౮౯॥ఆర్తి-౧౧-పా.

నయగుణశాలియాయముద । నారు రచించిన మీప్రబంధమే
ప్రియమున నెప్పుడున్ నుడువు । పెద్దలపాదుకలాత్మ వ్యాపక్క శే
శయమున నిల్పిగొల్తు సర । సంబగు శ్రీయతిరాజవింశమా
త్రియు మిముదెల్పునో యతిప । హాను॥౯౦॥

భృగ్వనుమాని విష్ణువెవ । రీశ్వరుడౌనని నిర్ణయించి మీ
వాగ్విధిభాష్యమేర్పరచి । వర్ధిలజేసితి రందుచేతనే
వాగ్వనితాముదంబున ప్రభు । వంబుగ మిమ్ముల భాష్యకృత్తనన్
దిగ్విజయంబుగా యతిప । హాను॥౯౧॥ఇరా-౮౭పా పెరియపర్॥

భూపతనూజనొక్క పెనుభూతముపూనిన పాపనెవ్వ
రున్నోపకయున్న మీదరిగి, యోపికతో శిరముందు పాదు
కల్ మోపిజగంబెరుంగ నల । ముక్తికిసంపిన మీప్రభావమే
తీపి నుతింతుగా యతిప । తీ హాను॥౯౨

శ్రీరమణీశు పూర్తియును । శ్రీమహిళాదుల పూర్తియున్ సహ
స్రారగదాసి శంఖవర । శార్ఙ్గ ముఖాయుధ దివ్యపూర్తినా
ళ్వారుల పూర్తిసర్వగురు । వర్యులపూర్తివహించుమీరలే
తేరుటమాకుగా యతిప । తీ హాను ॥౯౩॥ఇరా-౩౩-పా అడయార్

మతిజలియింపజేసెడికు । మార్గలన్నియుగుండె వేదము
న్నతి చెలువొందె ధర్మము ఘు । నంబును చెందెన శేషశిష్ట సం
తతిముదమొందె మీరు యవ । తారముజేసిన యుండెభూమి సం
స్థితిసుఖమొందెనో యతిప । తీ హాను॥౯౪ ఇరా పా నాట్టియు.

శ్రీపతికిన్ వశంబెమరి । శ్రీమహిళాదులకు న్వశంబె సే
నావతిముఖ్యసూరిజన । సంఘముకున్ శఠవైరికిన్ వశం
బే పరమార్యవర్యులకు । పేరుకొనంగ వశంబె స్వామి మీ
దేపని కావుమా యతిప । తీ హను॥౫౫అర్త్రి ౨౬ బెన్న

పోదిక స్వామి వీవుదల - పోయగ సామ్మును నేను శాస్త్రమ
ర్యాదను భర్త నీవు తెగ - రాని వ్రతస్థితి భార్య నేను భా
గ్యోదయ తండ్రివీవు తన - యుండుపోను నేనిక నాకునీకు
దే దయ సేయుమీ యతిప - తీ హను॥ ౫౬ అత్తి ౫ తన్ము.

అకలుషమైన తావక ప - దాంబుజ దాస్యమె ధారకంబు పో
షకమును భోగ్యమున్ పరమ - సాధ్యము సాధనమౌనుగాన మ
ధ్యకలభరంబు దేవరవ - శంబని నమ్మితి నమ్మితిన్ సుమా
త్రికరణ శుద్ధిగా యతిప - త్రీ హను॥౫౭॥ఇరా-౯౬-పా తవం రు.

అనఘుని కృష్ణునిన్ కరత - లామలకంబుగ మీరె చూపియి
చ్చినభవదీయ విగ్రహ విశిష్టగుణంబులె కాని యొల్లని
ట్లనుమతి జేసితేని నిర - యంబుననైన వరేశులోక మం
ది ననుతరింతునో యతిప - తీ హను ॥౫౮॥ఇరా-౧౦౮-కై యుల్.

కూరవరుండు దాశరథి - కోవిదులౌకురుగప్పిరాను మెం
చారరుళాళరర్ విమల - భావుడు రంగసుధాహ్వయుండు భ
ట్టారకులాదిగాగల ధృ - ఢవ్రతులెల్లను గొల్వభూమినిం
తేరహికెక్కితౌ యతిప - తీ ॥హను॥ ౫౯

ఘనులగు వైష్ణవోత్తముల - గాచుటకై హరి దైత్యులన్ సుద
ర్శనమున ద్రుంచుటేయరుది - సాహసికక్రియ వేదసూక్తులో
పని పెను మూఢదుర్మతుల - పైకొనియప్పుడు దేవరీరు యు
క్తినినిరసింతురో యతివ - తీ హను॥౬౦॥ ఇరా-౭౮-పా తేరార్.

రాక్షసవృత్తివానినను - రక్షణచేసెదనంచు నీశ్వరుం
డిక్షితి పెక్కురూపముల - నెత్తిన కార్యకరంబుగామి నే
మోక్షము జేర్తునంచు - నఘమోక్షణ మున్నొనరించి మీకృపన్
దీక్షవహించితౌ యతిప - తీ హను॥౬౧॥ ఇరా-౬౬-పా జ్ఞానంశనిం.

మించితికీజగంబునను - మీకరుణామృతవృష్టి యెల్లడన్
మించితిరావరాంకుశమ - నీవకు ప్రాప్తులమంచుచాల మో
హించితి రస్మదీయగుణ - హీనతజూడక బంధకంబులన్
ద్రుంచితిరుద్ధతన్ యతిప - తీ హను॥౬౨॥ ఇరా. ౭౭-పా ఉందన,

వేషముబావలున్ నెరపి - వేదురుగొన్నటి విత్తపుత్రదా
రీషణబద్ధబావత జ - రింపుచు మిక్కిలి జేసితిన్ మహా
దోషములన్నియున్ దొలగ - ద్రోవనుబోవను మీకెబారమా
ద్వేషినె నాయకా యతిప - హను॥౬౩॥ఇరా-౩౯-పా పొరుళుం.

మించిన యాదవాచలము - మీడట నుంచియు శేషశైల మం
దుంచియు రంగపట్టణము - నుంచియు భూతపురీవరంబు నం
దుంచియు మీకృపాగరిమ - మించియకించన రక్షణార్థమే
తెంచితిరేడకో యతిప , తీ హను॥౬౪

నిగమవిచారమీరలు ఫ , ణీంద్రుడవోయల సైన్యనాథుడో
అగణిత వైభవుండగు శ్రీ , యతిపతివోయని వేదసాత్వికుల్
తగతమలోన నెప్పుడు వి , తర్కము చేయుదు రే దమశ్శమా
దిగుణగరిష్టవో యతిప , తీ హను॥ ౬౫

విషయముకాని దంచెరిగి , వేమరునూర్లకు చెప్పిచెప్పి దు
ర్విషయమె నమ్మిచేయుదు వి , వేకమొకింతయు లేనివాడ నీ
విషమపరీక్ష జేయసల , వేయిలమీకును నైననేను స
ద్విషయమెరుంగనో యతిప , తీ హను॥౬౬॥ ఆర్తి-౧౬-పా,

అప్పుడునీ వేమాకు నిర , తానుభవాగతమైనస్వర్ణ పుం
గుప్పునీవే వాగ్గ్రిచుల , గొప్పచునొప్పు సుధారసంపు శై
ల్యప్పునీవే సంసరణ , లక్షణలక్షితమా వశమోధికిన్
తెప్పవునీవెకా యతిప , తీ హను॥౬౭

వట్టగునన్ని దిక్కులను , బర్వినకీర్తుల మిమ్ముగొల్చు వా
రెట్టికులంబు యెట్టికొడు , వెట్టిప్రవర్తన గల్గియున్న యా
యట్టికులంబు యట్టికొడు , వెట్టిప్రవర్తన మమ్మునేలుకో
దిట్టిమయుండెకా యతిప , తీ హను,౬౮॥ ఇరా౧౩౬-తిరుక్కత్తి

తినగతినంగ వేపకును । తియ్యదనంబొనగూరినట్లు ఇ
మ్మనుజుని దోషముల్ గనగ । మానక మాయభిమాన మందు చూ
చిన తనుదానె మంచిదగు । చేకురునాత్మ యటంచు యేలితో
దినమణి మండనా యతివ । తీ హాను॥౧౯॥ ఆర్తి-3౯

సుకరసరోజ పత్రముల । నొంపగునంగుళి పంక్తిశుద్ధతా
రకములచాలుబోలు నఖ । రాజియుశంఖ రథాంగవజ్రక
ల్పక కలశాసిచిహ్నాల శు । భంబగు పాదముల స్మదీయ మూ
ర్ధ్నికి తగజేర్చుమీ యతివ । తీ హాను॥౨౦॥-ఇరా-౨౧-పా కారుంద,

కులమును విద్యవృత్తముల । కించతజూడక దోషముల్ గుణా
దులతగు హానియున్ తలప । దోచక యుష్మద పారభూరి ని
శ్చల కరుణాకటాక్షమున । శాశ్వత దాస్యము లీయనాకు చిం
తిలపనియేమిపో యతివ । హాను॥౨౧॥ ఇరా. ౯-పాశింధైయి

నన్నునుజూచి నానడత । నంబునుజూచి గుణాఢ్యులైన మీ
యున్నతి జూచి యేలుకొన । యోగ్యతగాక మరేమిజూచిన్
మున్నుయెరింగి గొల్చుబుధ । ముఖ్యులు యేమని యెంచికొందురో
తిన్నగజూడుమా యతివ । తీ హాను॥౨౨॥ ఇరా-౨౦ పా ఎన్నయుం.

కష్టపుకాయ మొమ్మికల । కాలము గ్రూరతగమ్మియందు మా
యిష్టులజేరి నమ్మిచరి । యింపక వారలతోటిదొమ్మి నే
నష్టపడేనుసుమ్మి విడ । నాడగ నేటికి రమ్మిమీకృపా
దృష్టినియిమ్మమా యతివ । తీ హాను॥౨౩॥ ఇరా ౮౧ పా శోర్వ్యాన్ని.

క్షితితలమెల్ల పావనము । జేతురు వేదము వేదమార్గమున్
గతిచెడకుండ గాతురు త్రి । కాలపరిజ్ఞత విష్ణువైష్ణవ
వ్రతసుఖ నిష్ఠులైజనుల । వర్ధిలజేతురు మీపదాంబుజ
ద్వితయసమాశ్రితుల్ యతివ । తీ హాను॥౨౪

మాటికి బాసిలోనియురు । మాటికి జిక్కక కల్గినట్టి ము
మ్మాటినెరింగి గోప్యముల । మాటిలభించుకో మాటిచేత నే
మాటినయించి మాటిమెడ । మోహముగల్గిన వారికెందులన్
దీటిగలేరుగా యతివ । తీ హాను॥౨౪

వగురిగోసమైహరి ప । రేశుడు కృష్ణుడు తేరుమీదగీ
తాగమ మానతిచ్చిన త । దర్థము భూమిని విన్నవించు మీ
యోగమెరింగి గొల్చెటి మ । హోపకృతుల్ మరియెందు నెందు
నెందేగతి యాదురో యతిప । తీ హను॥౨౬॥ఇలా-౬౮ పా ఆరెన్నకు

పరమ పదాన శేషఫణి । భావతదాస్యపు పట్టభద్రుడై
వరనదలిర్పలక్ష్మణుడ । వైబలభద్రుడవై జనించి యి
ద్ధర నిలయాళ్లువారి యవ । తారముగైకొని యాత్మకోటికిన్
స్థిరవరదుండవో యతిప । తీ హను॥౨౭॥ ఇరా-౯-౫ పా. ఉణ్ణినీన్నిరు.

కొంచక కొంగునాటగల । కోమలి రంగపురీవరంబుకే
తెంచి వయింపయింబడుచు । దేశపురాజులు వచ్చిమిమ్ము సే
వించగజూచి మోహపడి । వేడినమంత్రము పాదుకల్ ప్రసా
దించితిరానుకా యతిప । తీ హను॥౨౮

శ్రీహరి భూమియందవత । రించి కనుంగవ కగ్గమైన నీ
దేహములుగాన కేచెడిరి । దేవరవారవ తీర్ణమైన యా
మోహముబాసి జ్ఞానము స । ముజ్జ్వలమైహరి శేషమైరి సం
దేహముదీరెవ్వా యతిప । తీ హను॥౨౯॥ఇరా-౪౧-పా మణ్మిసై.

తాపములొక్కమాటబరి । తాపము లొందుచు యెల్లవేళలన్
కోపముచేమునింగి యమ । కూపమునంబడి దుఃఖమొందగా
నోపగలేను మీఈశర । ణొందదలంతు నుతింతు నెంతునే
తేపకు తేపకుం యతిప । తీ హను॥౩౦॥ ఇరా-౯౬-పా. వళరుం.

అక్కడనుండి యిట్లుఘన । మైచనుదెంచిన సాంప్రదాయ మి
ట్లొక్కరి కొక్క రేదెలుపు । చున్న ప్రవృద్ధతగామి మారలా
యక్కరదెంచి యాసగని । యాఖ్యలు మీరుపదేశమిండనన్
దిక్కులునిండెగా యతిప । తీ హను॥౩౧ ఉ-౪-మా-3౭-పా

నమ్మితిమిమ్ము వేరొకరి - నమ్మనవాశనుగాను సుమ్ము మీ
పొమ్మనుకొమ్ము వేగకృప - జూచినవారలు కమ్ముదాస్యమే
యిమ్ముభవత్పదాబ్జముల - నెప్పుడు నాహృదయాన నుంచెదన్
తెమ్ముశుభంబుమా యతిప - తీ హను॥౩౨॥ ఇరా-౫-పా నయవే.

భుక్తియుముక్తి యున్నొసగ - బుట్టినదావిడ వేదమాత్ర స
ద్భక్తికెమెంచు దేవర ప్ర - భావమెఱింగి నిరంతరంబు యా
సక్తినిగొల్చు పెద్దలను సౌఖ్యతగన్గొన గూడుటెన్నడో
దిక్తటులెన్నగా యతిప - తీ హాను॥౮3॥ ఇరా-౭౯-పా కూటుం.

కరమున శంఖచక్రములు ; గైకొనిరంగ విభుండునేత్రగో
చరుడయి నిన్నునే విడన , జాలనటన్నను యుష్మదీయ బా
సురసుగుణాళి వెన్గగిలి , చుట్టుఁనిల్చియలంచునో తెరల్
తెరలుగవచ్చునో యతిప , తీ హాను॥౮౪॥ ఇరా ౭౫ పా శ్రీత్తైలై.

మెఱగగు కీర్తియున్ జలన , వృద్ధముగల్గిన వేంగడంబు నా
పరమపదంబు పాల్కడలి , పాల్పడి దేవర కెంతసౌఖ్యదా
కరమగునట్లు మీపద యు , గంబును దాసునకౌనుగాన యా
తెరవుఘటింపునూ యతిప తీ హాను ౮౫॥ ఇరా ౭౬ పా సన్నివేశ్.

కూర్చగదయ్య మిమ్మెరిగి , కొల్చెటి పెద్దలతోటి పొందునన్
మార్చగదయ్య యీ షణాల , మానముఖారి భయంకరాగ్ని చ
లార్చగదయ్య యేఫలము , చేకురనీనివి రోధికర్మమున్
దీర్చగదయ్యనో యతిప , తీ హాను ౮౬॥ ఇరా ౭౭ పా కైత్తన్

ప్రకటితమైనయట్టిగురు , వర్గమె మాక్తికపంక్తి మధ్య
నాయకమణీరు మీరలు ని , జార్యులు గోష్టియు కొల్కి పూన బో
ధకులగు చిత్రభూషణము , దానగుయీదృశ హారయష్టి సా
త్వికులు ధరింతురో యతిప . తీ హాను॥౮౭

ఖ్యాతికిజిక్కి లాభమున కైయడియాసల జెందియర్చన
ప్రీతికియుబ్బి యూరకె చ , రింపుచు నంతకుమీద వైష్ణవ
వ్రాతముతోడ నేనుసరి , వాడనికానను కొన్నవాని న
ధ్యేతలు గూడరో యడిప , హాను౮౮॥ ఇరా ౯౭ పా మత్తోర్.

భయముము భక్తియున్న వన , భావము కృత్యమకృత్యమన్నదే
దియుగనరాదు దేహముకు , దేహికి పేరును బుద్ధిలేదహో
దయయును సత్యమున్ శుచియు , తద్దయు లేదిక నెట్లుయేలితిం
దిరియ వశుసన్నునో యతిప ౮౯॥ ఇరా ౧౦౧ ఆర్తి ౮౨ మతుకు.

దేహముమీఁది మోహమును । దేహమునంటిన యట్టివారిపై
మోహమనిత్యమైన ధన । మోహము చారగనీక మీపయిన్
మోహము మీసమాశ్రితుల । మోహము పాదుకొనంగ జేయుమీ
దేహమెటంటినో యతిప । శ్రీ హను॥౯౦॥ ఇరా-౧౦౦-ఆ ర్తి-3

పూర్ణులగొల్చి యాత్మగుణ । పూర్ణుడవై భవ రూపవార్ధి సం
కీర్ణ దురంతజన్మగత । కిల్మషమెల్లను బాపెదేవతల్
వర్ణనజేయుచుండ నవ । వర్గము జేరుట దేవరీల వి
స్తీర్ణకటాక్షమో యతిప । శ్రీ హను॥౯౧॥ ఇరా-౧౦3-వళరం.

మకరవిముక్తమైనకరి । నూడ్కినిరాహువు బాసినట్టి శీ
తకరునిబోలిమేను విడి । తక్షణమాత్రనె జీవుడాతి వా
హకుల సహాయతన్ శత న । హ్రస్వ రవిప్రభ నర్చిరాది నో
ద్దిక జనుమీకృపన్ యతిప । శ్రీ హను॥౯౨॥ ఆ ర్తి ౨౦ పోం.

అరయగ నూర్ధ్వలోకముల । నన్నిటిదాటియజాండు లెన్నగా
మరివిరజన్ మునింగియు న । మానవ హస్తము సోకినంత ని
స్ఫురతరువిగ్రహంబొద వి । పొంగియెదుర్కొన నైదుసూర్లమిన్
తెరవలు వత్తురో యతివ । శ్రీ హను॥౯3॥ఆ ర్తి-౨౦

పచ్చసుగంధముల్ బులిమి । వస్త్రములన్ బహుభూషణాదులన్
దెచ్చియలంకరించిముద । మొప్తినుతింపుచు నాటపాటలన్
ముచ్చట పాదొనర్చిమును । ముందర బెట్టుదు రార్తికానుకల్
దెచ్చిరనేకులో యతివ శ్రీ హను॥౯౪॥ ఆ ర్తి-౨3-పా

అంతటవైన తేయులోక । యానము తెచ్చిన నెక్కి గోపుర
ప్రాంతముజేరి మ్రొక్కి బహు । రత్నవిరాజితమైన రాజమా
ర్గాంతరసీమనేగ నదు । రైమరి నిత్యులు ముక్తవర్గమే
తెంతురు వేడుకన్ యతివ । శ్రీ హను॥౯౫॥

సాధువచో విలాసములు । సల్పుచు నాగృహమేధివల్లభ
గాధిపుడంచుతాము తమ । కాంతలతో నిలయంబునన్ సమా
రాధనచాయ నేగదన । రన్ మణిమంటపమందు జేరు త
ద్దీధితులొప్పగా యతివ । శ్రీ హను॥౯౬

ఆమణిమంటపంబున స । హస్రఫణామణి మండలీప్రభా
ధామునకనంతు డాద్రుతు । తల్పమునన్ దొనరంగలక్ష్మియున్
భూమియు నీళయున్ గొలువ । భోగ్యతనొందు పరేశుజూచి యెం
తేముదమందునో యతిప । తీ హను॥౯౭॥ఆ ర్తి-౨౮

మీాయభిమాన భూతుడని । మెచ్చిరమాధరణీసమేత నా
రాయణుడాదరంబున । కరంబు కరంబునబట్టిమ్రుమ్మ ర
మ్మాయని యంకమందునిచి ॥ మన్ననశాయుగ గల్గజేయుటందే
యుపకారమో యతిప । తీ హను॥౯౮॥ఆ ర్తి-౩౮

తదుపరినాచ్చియారు తమ । దా కరుణామృత వృష్టిచన్ను బా
లుదరము నిండనిచ్చిన మహొన్నతులైయల నిత్యముక్త సం
పదలనుబొంది । సామములు బాడుచు నాడుచునుంట మీాజగ
ద్విదితకటాక్షమో యతిప । తీ హను ॥౯౯॥ ఆ ర్తి- ౩౮

అతులితమైన శేషి సుగు । ణానుభవంబునుదాన్ని ప్రీతి
కారితమగు సర్వదాస్యములు । ప్రేమనొనర్చుచు మెల్లకాల ము
న్నతిశయమైన సౌఖ్యముల । నందునునిత్యతనుండు మీాకృపో
దితుడగువాడువ్తొ యతిప । తీ హను॥౧౦౦॥ అ ర్తి-౫౮-పా

భూతపురీశ శ్రీవకుళ । భూషణపాద నివేశసంశ్రితవ్రాత
సుఖోదధీశభవ । వర్ధక పాపవినాశకోటి ఖ
ద్యోతనిభప్రకాశభవ । దుజ్వలశీల గుణానుభూతిమెం
దేతులమూగుదున్ యతిప । తీ హను॥౧౦౧

భూరిదయాక్ష మాదిగుణ । పూర్ణతమింపిన మిమ్ముగొల్చు మీా
వారలదాస్యమందొదిగి । వర్తిల నేర్చినయట్టి పుణ్యులే
చేరి సమస్త యజ్ఞములు । చేసితదీప్సితమౌ ఫలాకృతిన్
తీరినవారుగా యతిప । తీ హను॥౧౦౨॥ ఇరా-౯౭-పా తవ.

పెట్టదుమంచి నాకమున । భీషణమౌ నరకంబు లందునన్
బెట్టదుపూర్వమట్టినిక । పెక్కగు యోనులయందు పుట్టువుల్
పుట్టగనీదు నావశత । బోవగనివ్వదు భోగమందు నీ
దెట్టికటాక్షమో యతిప । తీ హను॥ ౧౦౩॥ ఇరా-౯౮- ఇదుమే.

వరవరమానివైజగతి । వర్ధిల్ల ద్రావిడ వేదశాస్త్రముల్
కరము ప్రసిద్ధిజేసితిరి । కష్టునినన్ను సనుగ్రహింపనా
వరుసనవీర వెల్లిఘున । వంశమునన్ మరి యప్పలార్యులై
తిరుగజనించితౌ యతిప । తీ హను॥ ౧౦౪

వంతకు మీరినట్టిపర వాది । భయంకర వంశమందు వే
దాంతగురూత్తమాఖ్యనవ । తారముగైకొని యస్మదీయదు
ర్దాంతదురంతదోషముల । నన్నిటిలోనిక మించిదాస్య మొం
దింతురుగాదెవ్వో యతిప । తీ హను॥౧౦౫

వాళిముఖేందుమండలము । వాళినిశాల కృపాకటాక్షమన్
వాళిశిఖోర్ధ్వపుండ్రములు । వాళిసుధాధరముల్ రదంబులున్
వాళికరద్వయంబు పద । వారిజయుగ్మము వాళివాళి యం
దేలికవాదువో యతిప । తీ హను॥౧౦౬

సనకసనందనాది ముని । సత్తము లెన్నగరానిమిమ్ము నా
మనసునదోచినట్లుపలు । మారునుతించితి లక్షణాదు
లేమియుగణుతింప నేరకన । మేయ గుణాత్మక యేనుసాపరా
ధినిక్షమసేయుమీ యతిప । తీ హను॥౧౦౭

హత్తినభక్తిచేత సుగు । ణాళిని బద్ధతమీరినట్టి య
ష్టోత్తరమైన యీశతక । మొప్పిదమేయని సాత్వికుల్ మనోభి
త్తుల వ్రాసిబెట్టుకొని । ప్రేమవచింతురు మీరువారి కం
దిత్తురు ముక్తినో యతిప । తీ హనుమద్గిరి రాజమందిరా॥ ౧౦౮

ఆయతిపతి సత్కృపచే
యీయతిపతి శతక మెపుడు । నెవరుపఠింపన్।
శ్రేయము నాయువు కీర్తియు
పాయక కరుణించిరంగ । పతిమెయొసంగున్.

శ్రీ హనుమద్గిరి యతిరాజ శతకము
సంపూర్ణము.

---

శ్రీమతేరామానుజాయనమః

# శ్రీ గోదాస్తవనక్షత్రమాలా.

గ్రంథకర్త:-
శిరాపురం శింగరాచార్యులగారు.

శ్రీమత్కర్కట పూర్వఫల్గుని నివాసిం । జేర్చు పాండ్యావనీ
సీమాంచత్తుల సీవనాంతరభువిన్ శ్రీభట్టనాధాత్మజో
ద్దామఖ్యాతి వహించి మించితివి గోదా నామధేయంబునన్
లేముల్ బాపి సిరుల్ ఘటింపనగు దల్లీ రంగనాథప్రియా. ౧

సారాసార వివేకవిత్తములునై సర్వజ్ఞులైయొప్పు నా
సూరిగ్రామణులౌ యతీశ ముఖరుల్ శోధించి జ్ఞానంబుచే
వైరాగ్యంబున భక్తిచే పదుగు రాళ్వారుల్ నినుంబోలగా
లేరంచుంగణుతించి రెల్లపుడు తల్లీ. ౨

ప్రబ్బంబూన్పగ వ్రొప్పుతీవసరియౌ బ్రాయంబుదాగాంచియే
గుబ్బా తల్లికి దండ్రికే వరునకుం గూతున్ దనూజాతి నం
చుబ్బుంజింతయుగూర్చు జవ్వనముచే నొప్పారునీచూడ్కి లే
లిబ్బుల్ గా నెరనమ్మియుంటింగద తల్లీ. ౩

సకలాత్మేశ వరాంఘ్రిదాస్య కలనా సామ్రాజ్యసంప్రాప్తికై
ప్రకటప్రీతి నహర్నిశంబు నెదలో ప్రార్థించుచో దండ్రి ''మా
వికచాబ్జేక్షణ నొక్కమర్త్యునకు గావింతున్ వివాహంబు బెం
డ్లికి యీడొప్పె'' నటన్న సొక్కితివి తల్లీ॥ ౪

బృందారణ్య విహార భూములను గోబృందంబులన్ మేపుచో
మందామందగతిం జరించు నెడలన్ మాద్యత్సురేశాజ్ఞులై
యందా ప్రేలధరించు శైలమును సత్యాశ్చర్యతంజూడ గా
లిందీ తీరము జేరగోరితివి తల్లీ॥ ౫

నీలగ్రీవ ధనుర్విభంజన కళానిర్ణీతమై సీతయున్
నీలాదేవియు సప్తగోవృషమృషా నిర్మోచనాకాంక్షచే
జాలిం దేలకనోలి నిల్చిరట యాచందంబు గాకుండ నే
లీలం దాల్తునటంచు చింతిలిన తల్లీ॥ ౬

విలబుత్తూరి తలంపులో సిరులచే వ్రేపల్లెగా దత్పుర
స్థలి కన్యామణులే వ్రజాంగనలుగా దానందులో నొక్క త్తై
యల విష్ణ్వాయతనంబె నందనిలయంబై యందులో శౌరి మేల్
చలవుండౌ ననగా దలంచితివి తల్లీ! ౭

రమణీయోజ్జ్వల స్వాతికోదయ ధను ర్మాసాధ్య పక్షంబునం
గొమరున్ వెన్నెల చెన్నొసంగుదరి వేగుంబ్రొద్దు మేల్కాంచి వై
శమువానల్గలుగంగ నోచితివి మేల్ దళ్కొత్త నీకిట్టి తా
లిమి యెట్లబ్బెనొ నాకవేద్యమగు తల్లీ! ౮

భావింపం బరతత్వముం ద్రవిడ సద్భాషా విశేషమ్ముచే
భావజ్ఞ న్మృదితాఖిలార్థములచే భాసిల్లునట్లుం 'దిరు
ప్పావుం' బాడితి వార్యసంతతులు సంభావింప నీ కారయన్
లే వజ్ఞాత కలారహస్యములు తల్లీ! ౯

మూఘల్ కేటఁగ సంగ్రహించి మదినామోదింప వేదాంత స
ద్గూఢార్థంబులఁ ద్రావిడోక్తుల రసాగుంభ ప్రసన్నాక్షరా
రూఢప్రాన పదాగ్ర్య వృత్తముల నారోపించితౌ గాన నా
లీఢప్రేమ నుతింతు, నీకృతిని తల్లీ! ౧౦

ఘనభక్తిన్ వనమాలికా కరణ సత్కార్యార్థియై తండ్రి కూ
ర్చిన పూదండలు కొప్పులోన మును గైసేయన్ స్ఫురద్భావసి తం
బును గాగంగొని నంతసించియటపై బుత్తెంచి శ్రీరంగశా
యిని మోహాంగతు, గాగఁ జేసితివి తల్లీ! ౧౧

నత మందారమ మూరుబానల గుడాన్నంబుం ఘృతాన్నంబు స
మ్మతినర్పింతునటంచు నాయకహరిన్ మన్నించి ప్రార్థించుచో
యతిచంద్రుండట నీదలంచినది సేయం 'గోవిలణ్ణం'చు బ
ల్కితి రామానుజ నామమింపెసగఁ తల్లీ! ౧౨

ఒకటో రెండో భవత్కటాక్షములలోనొక్కంత పైఁబర్వినన్
సకలోర్వీతల దివ్యశానన మహాసామ్రాజ్య ధౌరేయ ద
క్ప్రికటప్రాభవ మొప్పఁగొబ్బునను నాభాగ్యంబుచేనీవ హే
లికవై యుండగనేల చింతిలగ తల్లీ! ౧౩

ఓ లావణ్యవతీలలామ భవదీయోదార భోగార్థమై
కేలీమందిరమౌవిభూతి హరియుం గ్రీడార్థమై యుండు ను
ద్దాల శ్రీమదనంత నిత్యపరిషద్దాస్యాను రూపంబునన్
లీలాగారములీయజాండములు తల్లీ! ౧౪

శశిచూడాబ్జభవేంద్రముఖ్యులు భవచ్చారిత్రమూహింప మా
వశముంగాదని యూరకుండిరట నిన్వర్ణించువారే, ద్విపా
త్పశువుల్ దుర్ణయ దుస్స్వభావులు సదాపాపప్రచారైక బా
లిశులామాదృశ దుష్ట దుర్జనులు తల్లీ! ౧౫

శ్రీశ స్వాంతము నంతసిల్ల నతనిన్ సేవించి దాసాళు 'ల
న్యైశానా' యను బంధమే తలచి యేయేవేళలం గావగా
ధీశాంత్యాది గుణార్ణవంబునగు నీ దివ్యప్రభావంబు నే
లేశంబైన నెరుంగనైతిగద తల్లీ! ౧౬

నీకన్నుంగవ నీ ప్రసన్నముఖమున్ నీ సర్వభద్రావహా
స్తోకానర్ఘ్యగుణాతిలౌల్యసుజన స్తోమాఖిలాపద్భయా
నీకాహార్య వృషాభ హస్తయుగమున్నీ పాద యుగ్మంబు నా
లోకశ్రీల హసించి మించినవి తల్లీ! ౧౭

వనజాబ్జాంకుశ చాపసీరయవ సద్వజ్రార మీనాది లాం
ఛన దీవ్యత్తరుణారుణాంశుకర భాస్వద్యోగి హృద్ధ్యేయ మో
హన పాండుద్యుతిమన్నఖోల్లసిత దివ్యాంఘ్రిద్వయున్నాదు మా
ళిని దాల్తున్మణిమత్కిరీటముగఁ దల్లీ! ౧౮

ఆశాపాశ వశంగతుండనయి నేనర్థార్థినై దుర్జనా
భ్యాశంబొప్పగ జేరి సంస్తుతుల సేయంబూనినా నో
దయారాశీ నేరని నాయడఁగలుగు నేరమ్మాత్మ సైరించి యే
క్లేశంబుం గలుగంగనీయకుమి తల్లీ! ౧౯

అవమానంబులకోర్చి లుబ్ధజన హీనాలాపముల్ శ్రావ్యమై
స్తవముల్ జేసిన నేమి దీర్పగలరే దారిద్ర్య సంతాపముల్
వివిధాభీష్టఫలప్రదాయినివి నీ వేకాక నా కల్పవ
ల్లివి నీవుండగ నిర్భరుండగద తల్లీ! ౨౦

కన్యారత్నము నీకు నాదుయెడలం గారుణ్యమే కల్గినం
దైన్యాటవ్యనలాంబువాహ విలసత్త్వత్పాద తీర్థంబుచే
మాన్య ప్రాభవవైష్ణవావకృతికాన్మచ్చేతనాసక్తి మా
లిన్య క్షాళనమాచరించవలె తల్లీ! ౨౧

కనకాద్రిం గనుభంగి భాగవత సంఘంబుం గనుంగొన్నచో
వినయంబేమియు సేయనొల్లక మహావిద్వాంసుడన్ నాకు వీ
రెనయే యంచు నహంకరించు జడుడన్ హీనుండనౌ నన్ను నే
లిన నీకేమి కొఱంత దాసుడను తల్లీ॥ ౨౨

నాలో నేను దలంచి చూచినపుడే నావంటి మూర్ఖాత్ము లెం
దే లేరంచును దోచుచున్నయదియా హీనార్తి జన్మంబులున్
జాలున్ జాలికనైన సత్కృపను సంసారశ్రమాక్రాంతు నే
లీలన్నన్నుం దరింపజేసెదవు తల్లీ! ౨౩

అతుల భ్రాతృ సుతాగ్రహాగ్రహము దారావర్త భీమంబు
సంతత సంసారపయోధిలో మునిగి యీదన్ లేక భీతిల్లి దు
ర్గతి కేపాల్పడి యోడి బెండువడి నిక్కంబార్తిచే బ్రాలు
మాలితి నీమీదట నీయనుగ్రహము తల్లీ! ౨౪

పదరాజీవములాశ్రయించుట స్వరూపంబంఘ్రియుగ్మంబు
నెమ్మదిలో నమ్ముట సాధనంబు. సకలామ్నాయాధ్వ సంచారిణీ
విదితంబౌ భవదిష్టదాస్యరచనావిర్భావమే సాధ్య మెల్లె
డలన్ నీమహదాశ్రయంబ యిక తల్లీ॥ ౨౫

రాసక్రీడల వల్లవోపికల నారామానుజుండాదరో
ల్లాసానంగ కలారహస్య విలసల్లాస్యాది చాతుర్య సం
వాసా శ్లేషసుధాబ్ధి దేల్చెననుచున్ వర్ణింప శ్రీ మట్టపల్లీ
సౌధాంతరవాసి చేకొనవే తల్లీ॥ ౨౬

ఇపుడా శౌరి శఠారి సంయమియు నెంతే భాష్యకృద్యోగి స
త్కృపతో నామణవాళ మామునియు నేకీభావముం జెంది కా
శ్యప వంశాంబుధినుద్భవించి నిగమాంతార్యాఖ్యచే నాకు దె
ల్పెపడం జెల్పె భవచ్చరిత్రములు తల్లీ॥ ౨౭

ప్రేమప్రేరితుడై హారీతకులజ శ్రీ శింగరాచార్యుడ
న్నామాంచద్భవదీయ దాసుడిటులీనక్షత్రహారంబు ది
వ్యామోదాయతనంబుగా బలికి నీకర్పించె సద్భక్తితో
లేమా నీయెదదాల్పవే దయను తల్లీ రంగనాథప్రియా॥ ౨౮

శ్రీ గోదాస్తవ నక్షత్రమాలిక
సంపూర్ణము.



